చ హతవిధి యస్మదాదులవరుఁ డాత్మ యనందగుమృత్తికన్ బళో
ద్ధతిఁ గొని ముద్దచేసి వ్యధ యన్ బృఘుచక్రముఁ జేర్చి యాపదు
న్నతఘనదండఘాతన మనంబును బల్మఱు ద్రిప్పుచున్నవాఁ
డతఁ డికఁ నేమిసేయునొకదా చెలికాఁడ యెఱుంగ వేమియున్ 88

చ చెడుపను లూనియే యలఁతఁ జెంచెద వీయడియాస మాను మో
జడవిధి యాపదల్ బెనిచి సాదులథైర్య మడంపఁ బూనినన్
జెడ దది కల్పసంక్షయవిశీర్ణనిజక్రమపర్వతంబులో
యడఁపఁగ నింకఁజేయఁగ నవార్యపయోదులో యామహాత్మకుల్ 89

చ పలివిధి యేమి యెవ్వనికిఁ బ్రాప్తమొనర్చునొ వచ్చునంతయే
యతనికి నీచసంశ్రయమహాశ్రయముల్ గుఱిగావు సర్వది
క్ప్రితతులు నిండి మేఘములు ప్రత్యహముం గుఱియంగ నేయభీ
ప్సితములు గల్గె ద్విత్రిజలబిందువులే కద చాతకాళికిన్ 90

ఉ అంబుజబాంధవుం డహరహంబును దగ్గరివారిఁ గూడియే
యంబరఖండమూని తిరుగాడుచునుండును గ్రుంకుదాఁక న
య్యంబరఖండ మొందియె సుధాంశుఁడు ద్రిమ్మరు రాత్రులెల్ల దై
వం బె ఘటించినన్ గడవవచ్చునె దుర్గతి యెంతవారికిన్

---

## కర్మపద్ధతి

ఉ ఆనతి సేతునో సురల కయ్యమరుల్ హతవిధ్యధీనులే
యానిఖిలైకవంద్యుఁ డజుఁ డాతఁడు కర్మఫలప్రదుండె క
ర్మానుగుణంబు తత్ఫల మజాదులచే నగు టేమి పద్మజుం
డేనియు కర్త కాఁడు ప్రభు వింతకుఁ గర్మముగాన మ్రొక్కెదన్ 91

చ నెఱి నజు నండభాండకృతి నేమపుఁగుమ్మరిఁ జేసె నెద్ది శ్రీ
హరిని దశావతారగహనార్తిని సంకటపెట్టె నెద్ది శం
కరునిఁ గపాలపాణిపుటకంబున భిక్షుకుఁ జొన్పు నెద్ది భా
స్కరు దివిఁ ద్రిప్పు నెద్ది యల కర్మముఁ గూర్చి నమస్కరించెదన్ 92

చ కొఱగును సాధుగా మొఱకు కోవిదుగా నలి మిత్రుగా నగో
చరము సుగోచరంబుగ విషం బమృతంబుగఁ జేయు నెద్దియా
స్థిరతరసత్కృతిన్ భగవతిన్ భజియింపు మభీష్టసిద్ధికో
నరనుత మాని తామితగుణంబుల నేల వృథాస్థఁ జెందఁగన్ 93

చ సురుచిరకర్మమున్నపుడు సున్నపుమిద్దెలు చిన్నిపాయపుం
దెఱవలు తెల్లనౌ గొడుగునీడల హెచ్చులు లచ్చియున్నిరం

తరమయినట్టు లుండు నది తప్పిన నెంతయుఁ గంతుసంగరాం
తరహాతతంతుమౌక్తికవితానగతిన్ విలయై పడిన్ జెడున్ 94

చ గుణమగుణంబు నైన క్రియ గోరి యొనర్పఁగఁ బూనుపండితా
గ్రణి మునుమున్నె సేయదగు కర్మము పాకము నిశ్చయించి ని
ర్వ్రణమతి చెయ జెల్లు శుభవత్క్రియ లెంచక చేసినన్ దదు
ల్బణఫల మబ్బు దాఁకఁ గృతిపాకము హృద్గతి నేర్చు శల్యమై 95

చ జననము కర్మభూమిఁ గని సత్క్రియలేనిజడుండు చందనేం
ధనముల నువ్వుపొట్టు రతనంపుఘటంబున వండువాఁడు కాం
చనహలమూని క్షోణి దివసప్రభు దూచికి దున్నువాఁడు బా
య నఱికి కప్పురంపువెలు గారిగ చెనికిఁ బెట్టువాఁడగున్ 96

చ సుమహితరూపముల్ గులము శుద్ధపుశీలము విద్యయున్ బ్రయ
త్నము గలరాజసేవ విదితంబులె నిక్కము పూర్వజన్మపు
ణ్యముల జనించుసంచితసమంచితభాగ్యములే ఫలించుఁ గా
లమున ఫలించువృక్షములలాగున సత్యము మర్త్యకోటికిన్ 97

చ జలముల మున్గఁగాక సురశైలము పైకొనఁగాక శత్రులన్
జెలుకుర సేయఁగాక కృషి బేరము సేవలు సేయఁగాక వి
ద్య లెఱుగఁగాక పక్షివలె నభ్రగతిన్ జనఁగాక యెంతగా
సిలినను రాదు రానిది గ్రహించ దవార్యము కర్మపద్ధతిన్ 98

చ అడవులనైనఁ దోయములనైన విరోధులలోననైన మం
డెడుదవమధ్యమందయిన నీరధినైన మహాద్రినైన నె
క్కుడనయినన్ బ్రమాదగతి గాంచిన నిద్ర వహించినన్ భరం
పడి విషమస్థితుం డయిన ప్రాక్సుకృతంబులె బ్రోచు మర్త్యునిన్ 99

ఉ ఘోరవనంబు పట్టణ మగున్ జనులెల్ల స్వకీయు లౌదు రి
ద్ధారుణియంతయున్ దననిధానమణీగణపూర్ణయై తగున్
భూరిపరైకసత్క్రియలు పూర్వభవంబునఁ జేసి యున్నిటం
గౌరవ మొందు ధన్యులకు గావున ధర్మము సేయఁగాఁ దగున్ 100

చ ఉరుగుణయోగి భర్తృహరియోగి చమత్కృతి సంఘటింపఁగాఁ
గరము దనర్చు నీతిశతకం బదిబట్టి తెనుంగుబాసచేఁ
[illegible] జెప్పెఁ బుష్పగిరితిమ్మన చంపకమాలికాపరం
పరలు శివాంఘ్రిపూజలుగఁ బండితు లెంతయుఁ సంతసింపఁగన్ 10

నీతిశతకము సమాప్తము.

---

చెన్నపురి 'వావిళ్ల' ప్రెస్సున ముద్రితము—1954